# ఒకటి రెండు మాటలు

శ్లో. యదిసంతి గుణాశ్శ్లాఘ్యాః వికసంత్యేవ తే స్వయమ్,
నహి కస్తూరికామోదః కపథే న నివార్యతే.—

అని యొకానొక మహాకవి చెప్పినట్టులు, మృదుమధురరసార్ద్రములయి, సహజకోమలములును భావనామాత్రసంవేద్యములును నైన కవికుమారుల కవితాకల్ప ప్రసూనములందలి పరిమళలహరులు స్వయముగఁ దమంతతామే సమస్త దిగంతములను సయితము వ్యాపించి, విశ్వవ్యాప్తములును విబుధజనశ్లాఘ్యములును నై విలసిల్లుచుండఁగా, నందలి గుణవిశేషములను సహృదయులసన్నిధి నెఱుకపఱచుటకై నావంటి పరిమితప్రజ్ఞుని పరిచయవాక్యము లంతగా నవసరములు కావని తలంచుచున్నాను. ఏలయందురా?—మందారప్రసూనములలోని మకరందమాధుర్యమునుగ్రోలి సొక్కుటకు మిళిందకుమారునికి ఎవ్వరు పరిచయమును గలిగించిరి? మలయచందనమందలి శైత్యసౌరభ్యముల కుబ్బి తబ్బిబ్బై చ్ఛవానిని లోకమునందెల్లయెడల నింపదివిరిన దక్షిణానిలాంకూరమున కేసుధీవరుని పరిచయవాక్యములు ఉద్దీపనమును గలిగించినవి? అట్లే ప్రస్తుతము ప్రకటితములై భావుకలోకము సన్నిధిని అర్పింపఁబోవుచున్న యీ వెంకిపాటలనెడి ప్రేమపూతములగు కవితాకల్ప ప్రసూనముల విషయమునందుగూడ నని మనవి. అయినను ప్రస్తుత మాంధ్రలోకమునందు తక్కిన యన్ని యలవాటులతోఁ బాటు, ఎంతటి తేనెవాకలనూరించు సరసకావ్యమునకైనను ఏవో ఒకటిరెండు మాటలు పీఠికాకృతిని గ్రుచ్చవలసియుండుట యాచారమైపోవుటచేత, నందులకు విధేయులమై ఒకటి రెండు మాటలను యిచ్చుట మనవిచేయ సాహసించితిమే గాని ప్రజ్ఞాపారమ్యమునుబట్టిమాత్రము కాదు.

వెంకిపాటలు ఈ ఇరువదవ శతాబ్దిని మన యీ ఆంధ్రవాఙ్మయకల్పశాఖికను ప్రసవించిన సర్వాంగపరిపూర్ణ పరిణతీవిలసితంబులగు దివ్యప్రసూన రాజములు గాని, పూపబెడంగుల పచరించు పసరుమొగ్గలు కావు. బ్రహ్మానంద సహోదరమనియు, నవాఙ్మానసగోచరమనియును, నిర్వచించు రసస్వరూపమును—పండితులకు సైతము రూపింపశక్యముగాని రసస్వరూపమును—భావనాశక్తిగల ప్రతివారికిని గోచరమగునట్లు మూర్తీభవింపజేసిన అమృతఘుటికలుగాని అన్యములు కావు. దివ్యతాపూర్ణములగు భావనాసీమలందు ప్రయత్న విశేషమున

ప్రోదిసేయఁబడిన ప్రాభవసంపదల చెన్నలరారు పుష్పరాజములు కాని, అంతంతమాత్రపు అరవిరులెన్నటికినిఁ గావు. ఆంధ్రసరస్వతీపాదపీఠికయందు—భక్తిభరితమగు నభినివేశముతో—ప్రేమపూతములగు భావనలతో—సహజములగు అందములు చందములు—ముద్దుముచ్చటలతోఁ దీర్చికూర్చి సమర్పించిన దివ్యమహిమాసమన్వితములగు కంఠహారముల కూర్పులుగాని, ఏదో పదాడంబరముతో అందతుకులతో నేర్పరుపబడినవిమాత్రము కావు. ఇంతయేల ?—ప్రియపాఠకులు ఈ పూజా కుసుమములలో నేయొకిదానిని జిత్తగించినను ఈ నా మాటలు అతిశయోక్తులు ఎంతమాత్రమును కావని యెఱుంగఁగల్గుటయేగాక అనంతములు ననుభవైకవేద్యములు నగు రసరామణీయకతలను, అమంద మకరంద లలితములై దివ్యసౌరభ సురభితములై చిత్ర విచిత్ర వృత్త విలాస భాసురములై యొప్పు కవితావిలాసములను చిత్తగించి ఆనందింపగలుగుదురనుట నిక్కము.

మన ఆంధ్రసారస్వతోద్యానవాటికలయం దింతవఱకు చాలవఱకును ప్రౌఢప్రబంధరీతులతోను జటిలపదబంధములతోను ఘనములగు వృత్తబంధురతలతోను విలసిల్లి రసమహితములై యొప్పు ఉన్నతవృక్షరాజము లెన్నెన్నియో వివిధ రూపములతోఁ బ్రోదిసేయబడిన వనుటయు, అయ్యవి యన్నియును యథాశక్తి సౌరభపూర్ణములగు కుసుమఫలాదికమును ప్రసవించుచునే యున్నవనుటయునుకూడ సత్యేతరముకాదు. కాని [పండితపామరసాధారణముగా] జనసామాన్యము ఆస్వాదించి తనిసి తమంత తాము గానముచేసి ధన్యతం గాంచుట కనువగురీతిని — లాలిత్య సౌకుమార్య సౌందర్య సౌరభ్యములను వెదజల్లు మంజరులఁగల పూవుఁబోదలంతగా ప్రోదిసేయబడి యుండలేదు. అట్టి లోపమును తీర్చుటకై ఆధునికయుగమునందలి కవితోద్యానపాలకు లగు కవికుమారులు పెక్కురు నడుములుగట్టి రాత్రిందివములు పరిశ్రమచేసి ఆపూఁబోదలను దిద్దితీర్చి-అపూర్వములగు నందములలో నలంకరించి-ఏమాత్రముకూడ వన్నెయును వాసియును కొఱవడనీయకుండ విలసిల్లజేసి సార్వజనీనత నొనగూర్చుచున్నారు. వీరి యీ యుద్యమము బుద్ధమును సమృద్ధమునై యలరారఁగల సూచనలు గన్పించుట మిగుల ప్రశంస్యము.

ఈవిధముగాఁ బ్రస్తుతకాలమున మన యాంధ్రసారస్వతోద్యానపు సార్వజనీనశోభాభివృద్ధికై పాటుపడుచున్న తరుణకవికుమారకులలో శ్రీయుతులగు నండూరి వేంకటసుబ్బారావు పంతులు (బి. ఏ.,) గారును నొక్కరు. వీరు తెక్కన కవిప్రపంచమువలెగాక తమ శుశ్రూషాంజలులను భిన్నమార్గముల

నాంధ్రవాగ్దేవిసన్నిధి నలంకరించుచున్నారు. సుబ్బారావుగారు ఆంధ్రజాతికి సహజములై — శ్రావ్యములై — సొంపునింపగల మృదుమధుర గేయములలో అందునను నేడు వాడుకలో — వ్యవహారములోనున్న — జీవద్భాషలో వెంకి నాయుడుబావల దాంపత్య పూతిములును భావోన్నతములును ముగ్ధ ముగ్ధములును అగు ప్రణయ గాథలను గానముసేయుచున్నారు. నిజముగా వెంకి నాయుడుబావ లనే నాయకు లున్నారో, లేక వారు కవి కపోల కల్పితులో చెప్పజాలకున్నను—వెంకి పాటలను వినునప్పుడు మాత్రము, శ్రోతలు—తన్మయతనుజెంది తమతమ భావనావీదులలో—రసమయమూర్తులగు వెంకి నాయుడుబావలను తప్పక గాంచగల్గుదురు. ఒక్క కాంచుట మాత్ర మేనా ?—కాంచి—తా మనుభవించిన ఆ యానందమును—మఱల నా గీతముల తోనే—అనువాదరూపమున వెల్లడింపని సహృదయ శిరోమణి యుండుటయు గూడ గానము. వెంకి పాటల యం దింతటి మహత్త్వము గలుగుటకు తజ్జనకు లగు వేంకటసుబ్బారావు పంతులుగారి రసానుభవవ్యగ్ర మగు హృదయ పరిణామ పేశలతయును, లోకజ్ఞతయును ముఖ్యములగు కారణములని నాకు గల నమ్మకము.

తత్త్వాన్వేషణముఁ జేసినచో మనవాఙ్మయమునందలి గేయవిభాగముకూడ నిదివఱకే చక్కగ దిద్ది తీర్చబడినది. మహాకవిశిరోమణు లనందగిన క్షేత్రయ్య కవి, రామదాసు, వరదరాజు తాడంకివారు, ఏగంటివారు మున్నగు గేయ కవులు—తమ[illegible]ంగా సదృగ్ధారలుగల వాగ్ధారలతో—ప్రేమ—భక్తి—తత్త్వ ముల నమృతంపువాహినుల బ్రవహింపఁజేసి ధన్యతం గాంచియే యున్నారు. అమృతంపు రసవాహినులఁబారించి వారు ప్రోదిచేసిన ప్రణయవల్లికలు నాంధ్ర హృదయసీమల నల్లిబిల్లిగ నల్లుకొని పూచి ఫలించి తత్సౌరభములచే నిప్పటికిని మన కుల్లాసము గల్పించి శాశ్వతత్త్వము నందించుచునే యున్నవి. కాని వారు ప్రోదిచేసిన ప్రణయవల్లికాప్రసూనములు మన వెంకినాయుడుబావల ప్రణయ వల్లికలవలె విశుద్ధ ప్రేమభరితము లైనట్టివి గాక భక్తితత్త్వాద్యన్యాన్యతరజాతు లతో సమ్మిశ్రణమును గాంచినట్టివి. మఱియు వారు సేకరించిన ప్రసూనరాజ ముల సౌరభములు అద్వితీయమగు దార్శనికవిభవముగల యే కొలదిమంది ప్రజ్ఞా నిధులకో గాని తక్కిన సాధారణజనమునకు పూర్ణముగా నాస్వాదింప వీలుపడ నట్టివి. ప్రస్తుతము మన వేంకటసుబ్బారావుగారు సేకరించిన వెంకినాయుడు బావల ప్రణయపూతములగు నీపాటలన్నను పండితపామరసాధారణముగా— నెల్లవారికిని—యేమాత్రపు భావనాశక్తియున్నను, అందికొనుటకు ఆనందించి

తనిసి తనియింపజేయుటకును వీలైనట్టివి. నిక్కమగు ప్రేమయును, దాంపత్య భావమును, ధర్మపరతయును యెట్టి యాదర్శములను గలిగియుండునో యను విషయమును, ఈ పాటలంత తేటతెల్లము గా-సాధారణ జనమున కంతటికిని తెల్పగల గేయము లివితప్ప మనలో నితరములు లేవనుట సత్యదూరము కాదు.

సుబ్బారావు పంతులుగారు గానముచేసిన యీ పాటలలో భావము కంటెను ముందుగ భావయును, భావకింటెను ముమ్ముందుగ భావమును, సహ మహిమికతో బయ్యలెత్తుచుండును. ఏయొక్క స్థలమున నైనను వీని గమనము నందు యేమాత్రమైనను కుంటుపడినదేమోయని యెంతగ వెదకినను మచ్చునకైనను నాకు అట్టిది యిందు కానవచ్చుటలేదు. వీరు యీగేయములందు కూర్చిన పదములుగాని, పదార్థములుగాని కొందఱు కొందఱు కవితలలోవలె ప్రయత్న విశేషమున నేర్చి తెచ్చి కూర్చిన వెంతమాత్రమునుగాక ప్రతినిత్యమును మన కన్నులయెదుట-క్షణక్షణమును గోచరించుచున్న వే యగుట యున్నదగిన ప్రధానమగు విశేషము. ఇట్లయ్యును, వాని నీ కవికుమారుడు గేయరూపమున గూర్చి సహృదయలోకము సన్నిధిని ప్రదర్శించినప్పుడు మాత్రము-యెట్టివారికైనను "ఔరౌరా"—యని యనిపించునంతటి మహోజ్జ్వలత వీనియందు విలసిల్లి—తత్ప్రభావమున శ్రోతల హృదయసీమలు ఒక్కమాటుగా మిరుమిట్లు గొనుటయును కలుగుచున్నది. భావసాధనులగు ఘనుల కవితలయం దింతటి శక్తిసామర్థ్యము లున్నవి గనుకనే మనపూర్వికులు—

శ్లో. తఏవ పదవిన్యాసాః తా ఏ వార్థవిభూతయః,
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్ —

అని కవిస్తృష్టిని ఆనంద సంసూచకములగు శిరఃకంపనములతో గారవించి యున్నారు. ఇట్టి ప్రశంస్యతమములగు శక్తిసామర్థ్యముల నలవరచుకొనిన కవికుమారుడు—మన యాంధ్ర వాఙ్మయమునకు బొడసూపుటయును—నందుననుమనమున్న నీ యిర్వదవ శతాబ్దిని—మన కన్నులయెదుట-మన కవితామతల్లిని—యీ విధములగు దివ్యప్రసూనముల నర్చించి మనల నానందసాగరమున నోలలాడించుటయును చూడగల్గిన నసుబోటుల జీవితములు ధన్యములును, ధన్యతమములును-అని యనుటలో నావంతయును సందియము లేదు.

మొత్తముమీద నింతవఱకు నీకవి గానముచేసిన యీ ప్రణయపూతములగు గేయములు ముప్పదిరైదు వఱకును గలవు. క్రమవికాసమును భావ

పరిణతియునుగల ఈ కవితాప్రసూన గుచ్ఛములో * 8-26-31 సంఖ్యగల పాటలు-[అనఁగా మాయదారితమ్ముఁడు, సాటేలా, పడవ-అను శీర్షికలుఁగల పాటలు] కేవలమును వెంకియొక్క-ప్రణయగాథలకు మాత్రమే సంబంధించినవి కావు. కాని అంతయోయింతయో వెంకిప్రస్తావనకు అందును చోటు లేకపోలేదు. కనుకనే కాబోలు కవిగారు వానినికూడ నిందు పొందుపరచియుందురు. కాని మన మామూఁడుపాటలను పరిగణనమునందు పేక్షించితి మేని [ఉపేక్షించుటకు మఱొక బలవత్తరమైన కారణముకూడ కలదు. దానిని ముందు నిరూపింతును.] ఈ పాటలకు మనము గుచ్ఛమన్న పేరును వాడుటకెట్టి యభ్యంతరమును లేదు. శ్రీ సుబ్బారావు పంతులుగారి రచన లగు నీ గేయములలో నేయొకదానిని పరీక్షించినను మూఁడు నాల్గు చరణములకన్న నా కృతియందు గ్రంథబాహుళ్యము ఎక్కువగా గోచరింపదు. కాని వానియందే దానియందలి భావసంపదను వివరింపవలసివచ్చినను సంపూర్తిగా వివరించుటకు నలువది పేజీలకుఁ దక్కువగ పట్టనేపట్టును. ఇది భావుకులెటింగిన యంశమే కదా?

సాధారణముగా నుపోద్ఘాత రచయిత లగువారికి-ప్రస్తుత మగుచున్న యంశమును సాకల్యముగ చర్చించి గుణదోషవిచారణ సేయవలసియుండుట మిగుల ముఖ్యమని నే నెఱుంగకపోలేదు. కాని అల్పావకాశముగల ఈ ప్రదేశమున నద్దానిని నిర్వహించుట దుశ్శక్యము. కావున మఱొకమాఱు దీర్ఘముగా విమర్శింపఁ దలంపుగల నే నీవిషయము నింతతో ముగించుచు: భావసాధనుడగు నీ కవికుమారుని ప్రయత్నములు సఫలము లగునట్లును ఇట్టి వీరికి ఆయురారోగ్యైశ్వర్యాదివిభవముల నొసంగి, ఇతోధికముగ నాంధ్రవాగ్దేవికి సేవాంజలుల నర్పింపజేయునట్లును అనుగ్రహించుటకై ఆ పరాత్పరుని వేలకొలది ప్రణామములచేత నిరంతరము నర్థించుచున్నాను.

| చెన్నపురి<br>క్రోధన భాద్రపద శుద్ధ<br>సప్తమి ; బుధవారము. | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి |
|---|---|

---

* ఆర్యసంప్రదాయము చొప్పున 32 మణులుగల హారము గుత్స మనబడును. గుత్సమనుమాటయే గుచ్ఛమన్న పేరుతో వ్యవహారమున నున్నదని నాతలంపు. కావుననే, నేను నిచ్చట హారభేదమును తెలుపు సందర్భమున గుత్సశబ్దమునకు పర్యాయముగా గుచ్ఛమను పదమును వాడితిని. [పం. ఆ. శా.]

# పీఠిక



ఈ పాటలు నేను మద్రాసులో క్రైస్తవ కళాశాలలో పట్టపరీక్షకు చదువుకొనే దినాలలో (1917–1918) వ్రాయ మొదలెట్టినాను. అప్పుడు నా అదృష్టంవల్ల మ-రా- శ్రీ అధికార్ల సూర్యనారాయణ రావుగారి స్నేహభాగ్యం లభించటం, ఆయనతోకలిసి వాసంచేయటం కలిగింది. నన్నంతకు మునుపే సారస్వతవిషయాల్లో అంతో యింతో తరిఫీదు చేయుచున్న మా బసవరాజు అప్పారావుకూడా అక్కడే వుండేవాడు. వారితో ముచ్చట్లకు మ-రా-శ్రీ పాటిబండ అప్పారావుగారును వచ్చుట మామూలు.

వారందరు యెవరి రచనలగురించి వారు సొంపుగా మాట్లాడుకొంటుంటే నేనొకప్రక్క కూర్చుని విస్తుపోయి వినటం రివాజు.

ఒకనాడు కాలేజీనుండి ట్రాంబండిలో వస్తుండగా, గొంతులో సన్నని రాగం బయలుదేరింది. దానిని నాలో నేను పాడుకోవా లని సాహిత్యం జ్ఞాపకంచేసుకోపోయాను. ఎప్పుడోవిన్న పదంలాగున "గుండెగొంతుకలోన కొట్లాడుతాది" అన్న పల్లవి వచ్చింది. అదే మననం చేసుకోగా చేసుకోగా యిల్లు చేరేసరికి నేను వ్రాసిన మొదటిపాట తేలింది.

మా "జానకీ" పతికిన్నీ, అప్పారావుకున్నూ ఆ పాట గద్గదికతో విని పించాను. "సెబాస్ వ్రాయ"మన్నాడు జానకీపతి; "నీవు నిత్యం వాడేభాష కాదిది, యీ భాషసాయమున సత్యాన్వేషణం చేయలే"వన్నాడు మా బసవ రాజు అప్పారావు.

ఏ సమయమున వెన్ను చరిచాడో, సూర్యనారాయణ ! అప్పటినుండియు "యెంకి"ని కవితారీతిని స్మరించుట నిముసమైన మానలేదు. ఆతడును అంత కంతకు దన అభిప్రాయమును బలపరుచుకొన్నాడు. మా అప్పారావు రానురాను తన అభిప్రాయం మార్చుకొని యిటీవల అతడును వల్లె అనుచున్నాడు.

పాటలు అప్రయత్నంగా వచ్చేటట్లు ప్రసాదించిన రెయింకికి కృతజ్ఞుడనా ? ప్రోత్సాహముచేసి వీపుదట్టిన అధికార్లవారికా ? కవిత్వ కళారహస్యాలు తెలియజెప్పిన మా బసవరాజు అప్పరాయనికా ? షువ్వరకును.

ఇంకను సహృదయు లెందరో చాల కాలంనుంచీ నన్ను హెచ్చరిస్తున్నారు.

అందులో "రెయింకి" పాటలు పదిమందికీ వినిపించినవారు దేశోద్ధారక శ్రీయుత కాశీనాదుని నాగేశ్వరరావు పంతులుగారు. ఆంధ్రపత్రికలోనేమి, భారతిలోనేమి ఆ పాటలకు తగిన తావొసంగి, యీ పుస్తకం అచ్చులో యెంతో అభిమానంచూపి, రెండు మాసములు యీ పుస్తకమును తమ మూడు పత్రికలలోనూ ఉచితముగా అడ్వర్టైజ్ చేయునట్లు అర్డరు దయచేసినారు. వారికెంతో కృతజ్ఞుడను.

'సాహితి' మా పత్రికే. అనసూయ, జనరంజని, జ్యోతి, సుజనరంజనీ పత్రికాధిపతులును నాకెంతో గౌరవమొసంగినారు. శారదయు అట్లే. వారూ తెలుగుతల్లియొక్క నిజస్వరూపం చూడాలెనని ఉవ్విళ్లూరుచున్నవారే; తెలుగుపస, తెలుగునుడి, తెలుగునాదం, తెలుగురుచీ తెలిసికొని మనజాతి సాంప్రదాయాలలోగల సొగసు, జీవమూ, పదిమందికిన్నీ మనసుకెక్కించాలెనని కంకణము కట్టుకుని కృషిచేస్తున్నవారే. వారందిరికీ నా నమస్కృతులు.

ప్రభువులలో మా ప్రభువులును, కవులూ, రసికులూఅయిన శ్రీశ్రీశ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దురుగారు యీ పాటలు విని ఆనందించేవారు. ఆ మహారాజు నాకెన్నోవిధాల మేలుచేసినారు. వారివంశ మాచంద్రార్కమూ నిలుచుగాత యని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను. పాటలలో సగంపైగా నూజవీటిలో శ్రీవారి సన్నిధినే వ్రాశాను.

మా అభినవాంధ్రకవిమిత్రమండలి వారందరు నా ప్రాణమిత్రులు. మా ప్రెసిడెంటుగారగు శ్రీయుత కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి ద్వారా వారి దయకు బదులు నా వందనము లర్పిస్తున్నాను.

ఇందులో చిత్రపటములు మా అడవి బాపిరాజుగారు వ్రాసినవి. ఆయన చిత్రములలోని మహోన్నత భావాలకు నా రెయింకి పాటలే కారణమైతే, ధన్యుడను, ధన్యుడను !

మద్రాసు ఆంధ్రపండిత మండలివారు నన్ను ప్రత్యేకం ఆహ్వానించి గౌరవించారు. అప్పటినుంచీ పండితులంటే భయంపోయి భక్తే మిగిలింది. వారికి నా నమస్సులు.

కావ్యవ్యాకరణతీర్థులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిల వారికి మా యెంకి పేరుచెపితేనే యెంతో అపేక్ష; పాటలంటే ప్రాణమే. పండితులయిన్నీ "యేమో, చదువురానివారి పాట"లని తోసెయ్యరు. యెంకిపై పదిమంది హృదయాలల్లో భక్తి కలిగించింది. వారున్నూ, బ్రహ్మశ్రీ పాకృ-లూరి లక్ష్మీనారాయణగారున్నూ. వారిరువురికీ నా నమస్కారాలు.

తెలుగుదేశంలో పేరొందిన మేటిగాయకులు మ. రా. శ్రీ విద్వాన్ పారుపల్లి రామకృష్ణయ్యగారు యెంతో శ్రమపడి, శ్రద్ధతో యీ పాటలకు స్వరం వేశారు. వారికి నా నమస్కారాలు. అదే నేను పాడేవిధము.

తర్కవ్యాకరణ శాస్త్రవేత్తలగు బ్రహ్మశ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రిలుగారు తమకుతామై కోరి, యీ పాటలు చక్కగా అచ్చువేయించినందుకు వారికి చదువరులతోబాటు నేనును కృతజ్ఞుడను.

ఈ కృతి నర్పించినది నా పెత్తల్లి కుమారునకు. నా తండ్రి నాకు నాలుగైదేండ్లున్నప్పుడు కాలంచేస్తే, అప్పటినుండి యిప్పటివరకు మా కందరకు అతడే పట్టుకొమ్మ. "చంద్రున కొకనూలిపోగ"న్నట్లు అతని కీ కృతి సమర్పిస్తున్నాను.

మద్రాసు,
29—8—25.

నండూరి వెంకటసుబ్బారావు.

# కొత్త పాటలకు పీఠిక

ఎంకి పాటల ప్రథమ ముద్రణ మయిన్నీ ఆ ప్రతులు నిండుకొనిన్నీ ాడా చాల కాలం గడిచింది. ఈ కొత్త పాటలతో పాటు ఎంకి పాటల పున్ముద్రణమున్నూ చేయదలచి యెప్పటి కప్పుడేవో ఆటంకములమూలాన లశ్యం జరిగింది.

నేను 1926 లో న్యాయవాది వృత్తిలో చేరేటప్పుడే మిత్రులు aw కున్నూ కవిత్వానికిన్నీ సగమెరుకసుమీ అన్నారు. ఎంకిని నిత్యం ్రిస్తున్నా 1948 వరకు వీనిలో సగం పాటలైనా వ్రాయలేకపోయినాను. 948 లో శ్రీ మంచాళ జగన్నాథరావు (All India Radio, Patna) ారి స్నేహము లభించినది. వారు నాటినుండి సంవత్సరమున కొకతూరిరైన ంటు విచ్చేసి మా యింట విడిసి, వారి వీణా గాత్రములు మేళవించి, నోహర గానమొనర్చి మాటుమణగిన నాలోని పాటను మేలుకొలుపసాగిరి. ారి స్నేహభాగ్య మబ్బిన పిమ్మటనే యీ పాటలలో సగంపైగా వ్రాయ ిగితిని. వారి కెంతో కృతజ్ఞుడను.

వారే యెంతో శ్రమకోర్చి యీ కొత్తపాటలలో 40 కి సరియైన Notations) గురుతులతో స్వరాలు వ్రాసిరి. కాని అనివార్యములగు ారణములవల్ల వానినిగాని వెనుకటి పాటలకు కీ॥ శే॥ విద్వాన్ పారుపల్లి ామకృష్ణయ్యగారు వ్రాసిన స్వరాలుగాని యీ తఫా ముద్రింపలేకున్నాను.

మిత్రులీ పాటలు 'ఛా' ననియో 'కా' దనియో వీనిని ఆంధ్రలోకం ుక్క నదరులో వుంచినారు. కీ॥ శే॥ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు గుణములేనిదే వారు దూషింపరే యని వానిని (ఎంకిపాటలను) చదివితి" న్నారు. కావున 'కా' దన్నవారును నా పాటలు నేటివరకైన నిలుచుటకే ోడైనారు. వారికే ముందుగా నే నొనర్చు ప్రణామములు.

నా పాటలలో నొక చిన్న పాటకు శ్రీ భమిడిపాటి రామసోమయాజులు ారు (Now Advocate Chodavaram Vizag Dt.) ఏ నాడు

'భారతి'లో బొమ్మలు వేసినారో నాటినుండి వీనిపై వాదోపవాదములు పెరిగి జరిగినప్రచార మపారం.

కీ॥ శే॥ కళాప్రపూర్ణ వేదము వెంకటరాయశాస్త్రిలువారు (Nuzvid Conference, May '25) సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు (Reddy Conference, December '25) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలువారు (Andhra Panditha Mandali, Madras April, 25) శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలువారు (Introduction, Yenki Songs, 1st Edition) రావుసాహెబు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు (1925 మద్రాసు) నా పాటలయెడ చూపిన ఆదరణకూడ ఆ ప్రచారానికి దోహద మిడినది.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఏప్రియల్ 1925 లో వీనిని ప్రప్రథమున పండితసభ కెక్కించియు, Prof. D. Appala Narasimham M.A.L.T గారు 1926 లోనూ శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు (Now Chief Minister Hyderabad) 1928 లోనూ వీనిని 'భారతి' లో సమర్థించియు శ్రీ ఎం. చలపతిరావు, ఎం.ఎ గారును (Now Editor National Herald, Lucknow) మిత్రులు శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారును (Editor, Triveni) త్రివేణిలో వీనిని సానుభూతితో విమర్శించియు, మహా పండితులు కవులు నగు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు తమ 'ఆంధ్ర ధ్వన్యాలోకం'లో యీ పాటలలో నొక పాటను ఉదాహరణగానొనియు, ఆచార్య శ్రీ కురుగంటి సీతారామభట్టారకులు తమ 'నవ్యసాహిత్య వీధు'లలో 'ఎంకి'కి కూడ తావొసగియు, మా బెల్లంకొండ రాఘవరావుగారు ఒక్కొక్క పాటనే నిండు ప్రేమతో విమర్శించుచు పెక్కు వ్యాసములు వ్రాసియు, నా గురుతుల్యులు శ్రీ ప్రొఫెసర్ విస్సా అప్పారావుగారు (31-5-53) యెంకిపాటలకును గేయ ప్రపంచంలో ఒక స్థానమిడియు, 'బుచ్చిబాబు,' మిత్రుడు రుక్మిణీనాధుడు, శ్రీమతి రజనీగార్లు వీనిచుట్టును నాటిక లల్లియు, కీ॥ శే॥ అడవి బాపిరాజువంటి చిత్రకారులు వీనిని చిత్రించియు, సంగీతకళానిధి ప్రొ॥ ద్వారం వెంకటస్వామి నాయుడుగారివంటి మహావిద్వాంసులు వీని

నాదించియు, శ్రీ యమ్. చలపతిరావుగారివంటి ఆంగ్లభాషాపండితులు వీని నాంగ్లమున ననువదించియు, శ్రీ నటరాజ రామకృష్ణగారివంటి నాట్యాభినయ వేత్తలు వీని నభినయించియు, కవిసామ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ సుప్రసిద్ధ నవలలో వీని దయతో పేర్కొనియు, సోదరుడు కృష్ణశాస్త్రి వీనిని గురించి పలుతావుల నభిమానముతో పలికియు, వీనిని పెక్కుసభలలో పాడియు, రసికులు శ్రీ గుడిపాటి వెంకటచలంగారు వీనిని నిండుమనసుతో 'Muse' చేసియు, శ్రీ 'శ్రీశ్రీ' గారు 'స్వతంత్ర' లో వీనిలోని వెలుగులు చూపియు, మా సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకర స్వామిజీ వీనికి దీర్ఘాయువగున ట్లాశీర్వదించియు, 'ఎంకి' పాటలనుండి నా దృష్టి మరలకుండ చేసిరి. ఈ 'కొత్తపాటలు' వ్రాయుటకు వారందరి అంతః కరణ నాకు సాయమిడియుండును. ఈ నా ముసలిదశలో నా పాటల మననం ఒకయెత్తు, వారల ప్రేమవాక్కుల మననం ఒకయెత్తుగా కాలం గడుపు చున్నాను. అదే నా కృతజ్ఞత !

ఆల్ యిండియా రేడియో మద్రాసు, విజయవాడ, హైద్రాబాదు నిలయములవారు నా పాటలు నాకే చిత్రచిత్రగతుల నిత్యం వినిపిస్తున్నారు.

ఈ కొత్త పాటలు భావంలోనూ నిర్మాణంలోనూ పూర్వపు పాటల పంథా నుండి వొయిదొలగినవన్నారు. అందుకు సోదరుడు కృష్ణశాస్త్రి 8–5–53 న మద్రాసు కల్చరల్ క్లబ్‌లోనూ, కృష్ణాపత్రికా సంపాదకులు గడచిన రావు సాహెబ్ గిడుగు రామమూర్తిగారి వర్ధంతి సంచికలోనూ సమాధాన మిడిరి. మార్పుగుణమున కాయెనా దోషమున కాయెనా అను విషయము సహృదయ లోకమే నిర్ణయించాలి. ఏ యెడను మార్పు సహజం.

ఈ కొత్త పాటల అంకితం నా 'రవల వెలుగుల' పాటలో తలతడుము కొని తబ్బిబ్బులైన అద్భుతమూర్తికి. ఆ మూర్తికి నా కవిత్వ జీవితాదర్శముల యెడ నీరసభావముతప్ప మరోభావమునకు తావులేదని యెరింగియు నా భక్తి చేయ వేరు పూజాద్రవ్యములేమి వీనినే అర్పించుచున్నాను.

ఏలూరు
8–8–'53

నండూరి వెంకటసుబ్బారావు
గ్రంథకర్త

నా

పెత్తల్లి కుమారుడు

శ్రీ భావరాజు

వెంకటసుబ్బారావు గారికి

"రాష్ట్రములఁ బాలన మొనర్చు రాజుకాడు;
రాజె యాతఁడు నిజమనో రాష్ట్రమునకు."

# ముద్దుల నా యెంకి

గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ
కూకుండ నీదురా కూసింత సేపు !

..........................

నాకాసి సూస్తాది నవ్వు నవ్విస్తాది,
యెల్లి మాటాడిస్తె యిసిరికొడతాదీ !
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

..........................

కన్ను గిలికిస్తాది నన్ను బులిపిస్తాది,
దగ్గరస కూకుంటె అగ్గి సూస్తాదీ !
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

..........................

యీడుండమంటాది యిలుదూరిపోతాది,
యిసిగించి యిసిగించి వుసురోసుకుందీ !
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

..........................

మందో మాకో యెట్టి మరిగించినాదీ,
పల్లకుందామంటె పాణ మాగదురా !
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ॥

..........................

# వానలచ్చిమి

జాము రేతిరి యేళ   జడుపు గిడుపూ మాని
సెట్టు పుట్టా దాటి   సేనులో నేనుంటె
మెల్లంగ వస్తాది నాయెంకీ!
సల్లంగ వస్తాది నాయెంకీ!

పచ్చన్ని సేలోకి   పండు యెన్నెల్లోన
నీలి సీరాగట్టి   నీటు గొస్తావుంటె
వొయ్యార మొలికించు నాయెంకీ!
వానలచ్చి మనిపించు నాయెంకీ!

యెంకి వస్తాదాని   యెదురాగ నేబోయి
గట్టుమీదా దాని కంటి కాపడగానె
కాలు కదపాలేదు నాయెంకీ!
కరిగి నీ రౌతాది నాయెంకీ!

మాటలన్నీ సెప్పి   మంచెకిందా కెల్లి
గోనెపట్టా యేసి   గొంగడీ పై నేసి
కూలాసగుంటాది నాయెంకీ!
కులుకు సూపెడతాది నాయెంకీ!

యేతా మెత్తేకాడ   యెదురాగ కూకుండి——
మల్లీ యెప్పట్లె   తెల్లారబోతుంటె——
సెందురుణ్ణీ తిట్టు నాయెంకీ!
సూరియుణ్ణీ తిట్టు నాయెంకీ!

# యెంకిముచ్చట్లు ✓

యెన్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు
యేటి సెప్పేది నా యెంకి ముచ్చట్లు ?

వొడ్డి తోవ కళ్లె తొంగి సూడంగానె
'తోటకాడే వుండు తొరగొస్త ' నంటాని !

యెన్నాని సెప్పేది.........

యెంకి రాలేదాని యేటో సూత్తావుంటె
యెనకాలగా వచ్చి ' యెవురు వో 'రంటాది !

యెన్నాని సెప్పేది.........

' సిట్టి సేబా 'సాని నిట్టూర మేత్తుంటె
మాటా యినబడనట్టు మరి యేటో సెపుతాది!

యెన్నాని సెప్పేది.........

' కోడి గూసేసరికి కొంపకెల్లాలి, నీ
కోసరమె సెపుతాను కోప మొ ' ద్దంటాది !

యెన్నాని సెప్పేది.........

' యెంతసే పున్నాను యిడిసి పెట్టాలేవు
తగువోళ్లలో మనకి తలవొంపు ' లంటాది !

యెన్నాని సెప్పేది.........

యెన కెనక సూత్తానె యెల్లుతావుంటాది,
యెన్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు
యేటి సెప్పేది నా యెంకి ముచ్చట్లు ?

# యెంకితో తిరపతి

యెంకీ, నాతోటీ రాయే!

మన

యెంకటేశరుణ్ణి యెల్లి సూసొద్దాము!

ఆవుల్ని దూడల్ని
అత్తోరి కాడుంచి,
మూటా ముల్లె గట్టి,
ముసిలోళ్ళతో సెప్పి,

యెంకీ, నాతోటీ రాయే.....

ఆ సామి మీ దేటో
వూసూ లాడుకొంట,
కొండ మెట్లన్నీ నీ
కొంగట్టు కెక్కాలి,

యెంకీ, నాతోటీ రాయే.....

'రేతిరి పగ లేల
రెప్పెయ్య కెంకీని
సల్లంగ సూడ' మని
సామీతో జెప్పాలి,

యెంకీ, నాతోటీ రాయే.....

# సత్తెకాలపు సాయెంకి

" నీ తోటె వుంటాను నాయుడు బావా!
నీ మాటె యింటాను నాయుడు బావా!"

" సరుకు లేమి కావాలె సంతన పిల్లా ?"
" నువ్వు
మరమమిడిసి మనసియ్యి నాయుడు బావా!"
" సక్కదనము కేమిత్తు సంతనపిల్లా ?"
" నువ్వు
సల్లగుండు పద్దాక నాయుడు బావా!"
" యేడనే నీ కాపురమో యెల్తురు పిల్లా ?"
" నీ
నీడలోనే మేడ కడతా నాయుడు బావా!"

" నీతోటె వుంటాను నాయుడు బావా!
నీ మాటె యింటాను నాయుడు బావా!"

# దూరాన నాయెంకి

యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

పూతోరి పందిట్లో
సీతాయి యెల్తుంటె

నీ తళుకు గేపకాన
నా తల తిరిగిందోలె !

యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

మామిడి తోట కెల్లి
మంచీ పండోటి గోసి,

యేటోగాని, నోట్లేస్తె
యిసమై పోయిందోలె !

యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

పొత్తేళ జొన్న సేలో
సిత్తరమై పోతాది,

సుమ్మైన వోసనొస్తే
గుండెగిరిపోయె నోలె !

యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

# యేటిదరి నాయెంకి

'ఈ రేతి రొక్క తెప్పు యే మొచ్చినావే?'
'ఆడు నే నిక్కడే ఆడినామమ్మా!'

'యేటి నురగల కేసి యేటి సూశేవే?'
'మావోడి మన సట్టె మరుగుతాదమ్మా!'

'సెంద్రవొంకలో యేమి సిత్ర మున్నాదే?'
'వొంక పోగానె మావో డొస్తడమ్మా!'

"ఆడు నే నిక్కడే ఆడినా మమ్మా!
మావోడి మనసట్టె మరుగుతాదమ్మా!
వొంక పోగానె ఆడొస్త డమ్మా!"

# రావొద్దె!

రావొద్దె నాపక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయె నెంకీ!

నీ మీద పాణాలు నిలుపు కొంటా వొచ్చి,
అద్ద రేతిర్లోనె అడివంత తిరిగానె!!

రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయె నెంకీ!

గట్టెక్కి సూశాను! పుట్టెక్కి సూశానె!
కల్ల కపటము లేని పిల్ల వను కున్నానె!!!

రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయె నెంకీ!

యేడ నువ్వుండావొ యేళ్ళన్ని యీదానె!!!!
యేటి సేస్తుండావొ యీశ్వరు ణ్ణడిగానె!!!!!

రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయె నెంకీ!

# మాయదారి తమ్ముడు

(కృష్ణుడు)

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యరయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

ఇంతోళ్ల మప్ప్వాడు యీడ నిలుసుంటేని
నన్ను తరిమేసి మావోణ్ణి దాశావంట!

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యరయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

'యీ సరికి మరిదీని నేసూడలే' దాని,
యెంకి కూడా నిన్ను యేడుకోవొచ్చింది!

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యరయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

'పిల్లోణ్ణి వోపాలి బేగి తెమ్మన'మాని
మాయమ్మ రేతిరి మరిమారి సెప్పింది!

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యరయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

మావోళ్లు సూశాక మల్లీ నీ కిస్తాను!
నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యరయ్యో!
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా!

## నాయెంకి ~

నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు,
మొన్నె తిరిగొస్త నన్నాడే!

నీలు తేబోతుంటె, నీతోడె—వోలమ్మి!
నా యెంటె యెవురోను నడిసినట్టుంటాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు......

అద్దములో సూత్తుంటె అదియేటొ సిగ్గమ్మి!
నా యెనక యెవురోను నవ్వినట్టుంటాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు......

సల్లన్ని యెన్నెట్లొ సాపేసి కూకుంటె—
ఒట్టమ్మి—వొళ్లంత ఉలికులికి పడతాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు......

నీతైనవోడె, నా రాతెట్ట గుంటాదొ!
కళ్లలో సత్తెముగ కట్టిన ట్టుంటాడె!!!
నన్నిడిసిపెట్టెల్లినాడే,
నారాజు,
మొన్నె తిరిగొస్త నన్నాడే!!!



# నమిలి మింగిన సాయెంకి

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి !
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి !

మెళ్లో పూసల పేరు,
తల్లో పూవుల సేరు,
కళ్లెత్తితే సాలు
కనకాబిసేకాలు !

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి !
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి !

సెక్కిట సిన్నిమచ్చ,
సెపితే సాలదులచ్చ !
వొక్కనవ్వే యేలు
వొజ్జిర వొయిడూరాలు !

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి !
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి !

పదమూ పాడిందంటె
పాపాలు పోవాల !
కతలూ సెప్పిందంటె
కలకాల ముండాల !

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి !
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి !

తోటంతా సీకట్లె!
దొడ్డి సీకటిమయిమె!
కూటికెళితే గుండె
గుబగుబమంటా బయిమె!
యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

రాసో రింటికైన
రంగు తెచ్చే పిల్ల!
నా సామ్మె—నా గుండె
నమిలి మింగిన పిల్ల!
యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

# కటిగ్గుండెల నాయెంకి

నీవెల్లిపోయినావంటే,
పచ్చినై,
నే నేటా కొట్లాడుతుంటే ;
యిరుగమ్మలక్కలతో నీవా
నా యెంకి,
యెకసక్కె మాడుతున్నావా!

నిన్ను రచ్చించ మంటా నే
పద్దాక,
యెన్నొ దణ్ణాలు పెట్టనే!
వాన్నెసీరలు గట్టి నీవా,
నా యెంకి,
వోసుగా తిరుగుతున్నావా!

పొద్దత్తమానాలు కాదే
నీవూసె,
వొద్దన్ననూ మరుపురాదే!
అమ్మలక్కలతోటి నీవా,
నా యెంకి,
సెమ్మసె క్కాడుతున్నావా!

రేత్రిళ్లో మనతోటకాడా,

వొక్కణ్ణి,

నా తిప్ప లీశ్వరుడు లేడా!

సీకు సింతాలేక నీవా,

నా దొంకి,

పోకల్లె పొండుకున్నావా!

*

# తోటవూసు

తోటవూసంటే సికాకూ,

ఎంకి

తోటి యెల్లే దాని సోకూ !

బంతీ సేమంతంట్ల
పరువంతా మాసింది ;
మల్లెంటు మెల్లంగ
మారుమొగమేసింది !

తోటవూసంటే సికాకూ,

యెంకి.......

తూర్పేపు మల్లేటి,
దుబ్బు దుబ్బు దుట్రాయేటి ;
అంటు మామిళ్లేటి,
ఆవారస పల్లేటి !

తోట వూసంటే సికాకూ,

యెంకి.......

గొడ్డూగోదా బెంగ
గొని సిక్కిపోనాయి ;
గడ్డిమేటిని సూత్తై
కడుపే సెరువౌతాది !

తోటవూసంటే సికాకూ,
యెంకి.........

నూతికాడే సోకు
యేతాముదే సోకు ;
పోయి 'పాషో' యంటె
'వో' యంట పలికేవి !

తోటవూసంటే సికాకూ,
యెంకి.........

ఒలము సీదాపోయి
బడుగునై పోనాను ;
కృష్టా రామా యంట
కూకోవలి సొచ్చింది !

తోట వూసంటే సికాకూ,
యెంకి.........

# యెంకితో బద్రాద్రి

ఆడ నీ సుక్కాని యీడ నే గెడవేసి
పడవెక్కి బద్రాద్రి పోదామా!
బద్రాద్రి రాముణ్ణి సూదామా!

గోదారి గంగలో కొంగుకొంగూగట్టి
కరువు తీరా బుటక లేదామా!
సరిగెంగ తాణాలు సేదామా!

కొత్తమడతలు కట్టుకోని పెజలోకెల్లి
'రామన్న రాముడో' యందామా!
రామకతలే పోయి యిందామా!

సంబరము కెదురుంగ జంటగా నిలుసుండి
సామివోరికి దణ్ణమెడదామా!
సాపసుట్టుగ నేల బడదామా!

ఈడ నీ సుక్కాని ఆడ నే గెడవేసి
పడవెక్కి మనపల్లె కెడదామా!
బద్రాద్రి రాముణ్ణి యిడదామా!

# యెఱ్ఱి సరదాలు

యెంకీ వస్తాదాని
యెదురు తెన్నులు కాసి,
దిగులుట్టి, తలదించి,
తిరిగి సూసేతలికి——
యెంకిరావాలి! నాయెదర నిలవాలి!
కులుకుతా నన్నేటో పలకరించాలి!

పిల్లపోరుగూరెల్లి
మల్లి రాలేదాని,
వొల్లంత వుడుకెత్తి
వొక్కణ్ణి పొడుకుంటె——
ఘల్లుమంటా యెంకి కాలుపెట్టాలి!
'యెల్లివొచ్చా' నంట యెంకి నవ్వాలి!

యెంకి కోపా లొచ్చి
యే దేశమో పోయి,
కల్లో నా కాపడితె
కళ్లు తెరిసే తలికి——
తళుకుమని యెంకి నాదరికి రావాలి!
'నిదర కా బో'సంటు నింద లాడాలి!

## యెంకి సూపు

పదిమందిలో, ‘ యెంకి
పాట ’ నే పాడంగ
గోడసాటున యెంకి గుటక లేసే యేళ,
సూడాలి నాయెంకి సూపు లాయేళ !
సూడాలి నాయెంకి సోద్దె మాయేళ !

‘ నా పాటె పా’ టంట
‘ నా మాటె మా’టంట
నలుగు రమ్మలు సేరి నను మెచ్చుతావుంటె,
సూడాలి నాయెంకి సూపు లాయేళ !
సూడాలి నాయెంకి సోద్దె మాయేళ !

పొరుగమ్మతో నేను
వోరస లాడే యేళ,
పొలమెల్లి నే పొద్దుపోయి వచ్చేయేళ,
సూడాలి నాయెంకి సూపు లాయేళ !
సూడాలి నాయెంకి సోద్దె మాయేళ !

# యెట్టి నాయెంకి

'యెనక జల్మములోన
యెవరమో' నంటి!

సిగ్గొచ్చి నవ్వింది
సిలక—నాయెంకి!

'ముందు మనకే జల్మ
ముందో లె' యంటి!

తెల్ల తెలబోయింది
పిల్ల—నాయెంకి!

'యెన్నాళ్లో మనకోలె
యీ సుకము' లంటి!

కంట నీ రెట్టింది
జంట—నాయెంకి!

# యెంకి పయనం

దుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ !
డుపులో సెయ్యేసి కలిపేసినాదీ !

ఎడ తెగని జలమంట !
నడమ నో పడవంట !
పడవెక్కి నా యెంకి పయన మయ్యిందంట !

దుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ !
డుపులో సెయ్యేసి కలిపేసినాదీ !

యెంకేటో బ్రమపుట్టి
యెనక తిరిగిందంట !
సందెగాలికి పడవ సాగిపోయిందంట !

దుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ !
డుపులో సెయ్యేసి కలిపేసినాదీ !

సీటిగాలికి యెంకి
పై కెగురుతాదంట !
పడిపోయిన క్లోటో పడ వెల్లినాదంట !

సదుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ !
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ !

పిల్లసిగలో పూలు
కళ్లిప్పినాయంట!
మిడిసిపాటున దోనె మీరిపోయిందంట!

పదుకుంటె నాకేటొ బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!

మెడసాటు పూసోటి
మినుకుమంటాదంట!
పంతాన గంతేసి పడవ పోయిందంట!

పదుకుంటె నాకేటొ బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!

అంసల్లె, బొమ్మల్లె,
అందాల బరిణల్లె,
సుక్కల్లె, నా యెంకి సురిగిపోయిందంట!

పదుకుంటె నాకేటొ బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!

